# శ్రీ నవబ్రహ్మ చరిత్ర




రచయిత

**కామరాజుగడ్డ హనుమంతరాయశర్మ**

ఎల్లారెడ్డిగూడ, హైదరాబాద్-73

# శ్రీ నవబ్రహ్మ చరిత్ర



రచయిత

**కామరాజుగడ్డ హనుమంతరాయశర్మ**

ఎల్లారెడ్డిగూడ, హైదరాబాద్

ద్వితీయ ముద్రణ : జూలై 2009

ప్రతులు : 1000

ప్రచురణకర్త :
యం.వి. రమణ
బి.విభాగము, 502,
దహిసర్,(వెస్ట్), ఖాన్‌దార్‌పడ,
లింక్‌రోడ్డు, బోరివెల్లి (వెస్ట్),
ముంబాయి.

ముద్రణ
శ్రీ ధరణి ప్రింటర్స్
ఖైరతాబాద్, హైదరాబాద్-4

ప్రతులకు :
కామరాజుగడ్డ హనుమంత రాయశర్మ
కె/ఆఫ్ : యం.వి.ఆర్ ప్రసాద్
ఏ4, ఆర్.బి.ఐ. క్వార్టర్స్,
ఎల్లారెడ్డిగూడ, హైదరాబాద్-73

వెల : RS. 9-00
భక్తిశ్రద్ధలు

# కృతజ్ఞతా సుమహారం

శ్రీ మున్నంగి వేంకటరమణ గారు అనుకోకుండా ఒకరోజు నా యీరచనలను చూడటం జరిగినది. చూచినదే తడవుగా ఈ గ్రంథములను అచ్చువేయు కార్యక్రమమును సహృదయముతో తనదిగా భావించి యీ గ్రంథ ప్రచురణకై వలసిన ముద్రణ వ్యయము భరించటానికి ముందుకు వచ్చి సర్వ విధ శ్రద్ధ వహించినందులకు శ్రీ రమణగారికివే నా ప్రత్యేక అభినందనలు. సజ్జనులు, నిరాడంబరులు, మానవసేవాతత్పరులు అయిన శ్రీ వేంకట రమణ, శ్రీమతిరమాదేవి దంపతులకు, వారి కుటుంబానికి ఆ శ్రీరామచంద్రుని దివ్య ఆశీస్సులు నిరంతము లభించుగాకయని హృదయపూర్వకముగా కోరుచున్నాను.

ఈ గ్రంథములను సర్వాంగ సుందరముగా ముద్రించి ఇచ్చిన శ్రీ ధరణి ప్రింటర్స్, ఖైరతాబాద్, హైదరాబాద్-4. యాజమాన్యమునకు, వారి సిబ్బందికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నాను.

ఇట్లు
రచయిత
కె. హనుమంతరాయశర్మ

# తొలిపలుకులు

జీవితంలో మంచి కవిత్వం వ్రాసే అదృష్టం లభిస్తే ఆ అదృష్టాన్ని భగవంతుడు తనకు ప్రసాదించిన వరంగా భావించి, భగవంతుని గుణ, గణ వైభవ వర్ణనలతో స్తుతించి, కీర్తించి జీవితాన్ని సార్థకం చేసుకోవటం భగవదానుగ్రహం.

నాకు బాల్యము నుండి భగవదారాధన చాలా యిష్టము. పూజలు చేయడం, కొంతమంది పిల్లలను కూడగట్టుకుని భజనలు చేయడం, ఆధ్యాత్మిక చింతన కూడా వయసుతోపాటుగా పెరుగుతూ వచ్చింది. నాపూర్వ జన్మల సుకృతమో, మా పూర్వీకుల ఆశీస్సుల ఫలితమో, అన్నింటిని మించి భగవదానుగ్రహమోగాని నా ఆత్మ సంతృప్తికోసం గ్రంధ రచనల ద్వారా భగవంతుని స్తుతించి, కీర్తించి జీవితాన్ని సార్థకం చేసుకోవాలనే ధృఢ సంకల్పంతో 1980వ సం॥లో తొలి రచనగా భజన కీర్తనలు వ్రాశాను. అవి 1987వ సం॥లో ప్రథమ ముద్రణ నందుకున్నవి. ఇంకను నా ఇతర పద్య రచనలను మలిపేజీలో వివరించితిని. ఈ గ్రంధములు పదుగురి హృదయాలలో ప్రవేశించి వారి హృదయాలను స్పృశిస్తే సాక్షాత్తు ఆ శ్రీరామచంద్రుని దర్శించినంత అనుభూతిని పొందగలిగినవాడను అగుదును. అందువలన ఈ గ్రంధములను చేతబట్టిన వారందరూ ఆ మూలాగ్రం చదవమని, ఇతరుల చేత చదివించమని, భగవంతుని కృపకు పాత్రులు కాగలరని హృదయపూర్వకముగా మనవి చేసుకొనుచున్నాను.

కృతికర్త

కామరాజుగడ్డ హనుమంతరాయశర్మ

ఓం శ్రీ సాయినాథాయ నమః

# అభిప్రాయము

సహజకవి **యామన బసవయ్య,**
B.A., B.Ed.,
కందరామాయణ గ్రంధకర్త
సిగడాం, శ్రీకాకుళం జిల్లా

ఆ॥ నీతివిదుడ వీవు నీతి పద్యములను
ప్రీతితోడ తెల్పు పెద్దవీవ
సంఘదోషములనుసంస్కరింపగబూని
శతక మల్లినావు సత్కవీంద్ర!

క॥ లోకము పోకడ లెల్లను
ప్రాకటముగ నెఱిగినట్టి పండితవర! యే
చీకులు చింతలు లేకను
శ్రీ కరుని భజించు నట్టి చిన్మయరూపా!

ఆ॥ అలతి అలతి పదము లందందు చేకూర్చి
కవిత లల్లినావు కడుముదమున
పండితులును మెచ్చ పర్రీశు దలచుచు
రచన సల్పినావు రమ్యముగను

క॥ హితముగ మితముగ బలుకుచు
సతతము హరిచింతనంబు సన్మిత్రులతో
మితముగ మెలగెడి మీరలు
మతిమంతులు గాదె భువిని మాన్యచరిత్రా!

ఆ॥ రవియు, శశియు దివిని రాజిలు నందాక
మీదురచనవెల్ల మేలుగాను
వెలయుగాక! భువిని విజ్ఞులు మెచ్చగ
హనుమదంశరూప! ఆర్య తలప!

ఆ॥ బంధు హితుల తోడ పొందుగా దినములు
గడిపి దేవదేవు కడుముదమున
మనమునందు దలచి మహిమాస్పదుండైన
సాయి ప్రభుని దలచు సత్కవీంద్ర!

క॥ సాయియె రాముడు యనుచును
సాయియె శ్రీకృష్ణుడనుచు, సాయియె శివుడున్
సాయియె క్రీస్తు యటంచును
సాయియె మహమ్మదు యటంచు సత్కవి వర్యా!

క॥ తలచుము మనమున నిరతము
పలువురు పండితులు బుధులు ప్రాజ్ఞులు భువిలో
తలతురు దేవుం డొకడని
పలుకుచు, తెల్పెదరు మనకు పరమార్థమిలన్

10-4-2000 ఇట్లు
గుంటూరు యామన బసవయ్య

# అభిప్రాయము

**డా॥ ప్రసాదరాయ కులపతి**

*శ్రీనాథపీఠ నిర్వహణాధ్యక్షులు*

*రిటైర్డ్ ప్రిన్సిపల్, హిందూ కాలేజి*

*గుంటూరు*

శ్రీ కామరాజుగడ్డ హనుమంతరాయ శర్మగారు సంప్రదాయ ప్రవణులైన విప్రవరేణ్యులు, ప్రాతఃస్మరణీయులు శ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితుల ఉపన్యాసముల వలన, రచనల వలన ప్రభావితులైన వారిలో వీరొకరు. ఇంకా శాస్త్ర పురాణ పఠనము, పండిత సంగము వీరి భారతీయ సాహిత్యోద్యమమునకు పదును పెట్టినది. వీరి పద్యగద్య గేయ రచనలలో సంస్కారము పదపదమున గోచరించును.

"ఇటువంటి ప్రజ్ఞాలక్షణములు గల శర్మగారు వారి విజ్ఞానాన్వేషణలో విశిష్టమైన నవశబ్దము చేత ఆకర్షింపబడినారు. అది పరబ్రహ్మస్వరూపమని గుర్తించి, భావించి దానికి సంబంధించిన విశేషములనన్నింటిని సేకరించి వానికి ఛందోమయమైన రమణీయాకృతిని సంధానించినారు. నిర్దుష్టమైన ధార, సరళమైన శైలి తన పద్య రచన కలం కారములు కాగా తన ధ్యేయమునందు కృతార్థతను సాధించిన రచయితను హృదయపూర్వకముగా నభినందించుచు ప్రాజ్ఞలోకము దానిని ఆదరభావముతో స్వీకరించి, ఆనందించగలదని ఆశించుచున్నాను.

దీ. 13-2-1999

శ్రీరామ రక్ష

# -రచయిత మనవి-

శ్రీ కృష్ణ పరమాత్మ పాండవ మధ్యముడైన అర్జునునకుయుద్ధ ప్రారంభ సమయమున గీతను బోధించుచు, విభూతి యోగములో కొన్ని తనవిభూతులుచెప్పి, అర్జునా నీకు కొన్నిమాత్రమే చెప్పితిని. గానినా విభూతులు అనంతములు అనెను గదా. నేను విభూతి యోగము చదివినప్పుడుసంఖ్యలలో 9వ సంఖ్య, పరమాత్మ విభూతిలో చేరియుండవచ్చు గదా? ఓ మిత్యత్యేకాక్షరంబ్రహ్మ అనుచున్నాము గదా? అట్లే 9వ సంఖ్య బ్రహ్మ స్వరూపం యెందుకుకాకూడదు? అను నాలోచన నాలో కల్గింది. పరమాత్మ కృపచే వెంటనే నాలో అపరిమితానందము కలిగింది. 9వ సంఖ్య ఎన్నో మహిమలు కలదిగా, పూర్ణ సంఖ్యగా ఆనోటానోటా వింటున్నాం. గాని, నా దృష్టిలో ఏం పండిత, కవులును, దీనిని గురించి గ్రంథ రచన చేసినట్లు లేదు. ఎందుకురచన చేయలేదో తెలియదు. పరమాత్మ దాశరధిగా నవతరించిన నవసంఖ్యను పండితులు విస్మరించారేమోననిపించి చాలా బాధపడ్డాను. వెంటనే నవసంఖ్యను బ్రహ్మ సంఖ్యగా, పరమాత్మగా నిరూపించి, పద్య రూపంతో చిన్న గ్రంథం వ్రాయాలనిపించింది. భగవానుడు కరుణామయుడు కదా. ఈ అల్పునిచే దీనిని వ్రాయించ సంకల్పించాడేమో. లేక నాకది సాధ్యమా? భగవంతునిపై భారంవేసి ప్రారంభించాను. శివపురాణం దేవీభాగవతం, బ్రహ్మవైవర్తం మొదలగు గ్రంధాలు పరిశీలించాను. శివపురాణం ప్రణవాన్ని శివునిగా వర్ణించింది. ప్రణవంలో నవశబ్దం వున్నది. ప్రనవమె ప్రణవముగా మారింది. రెండూ సమానార్ధకాలు. నవశబ్దం ప్రణవంలో తిష్టవేసింది. అంటే అంత అగ్రస్థానంలో వుంది. పూర్వీకులు రచించిన పద్యంలో 9దిని బ్రహ్మసంఖ్యగా వర్ణించారు. ఆ పద్యం చూడండి.

కం. **తరుణీ నామాక్షరములు స్థిరమునేడింట బెంచి, తిథితోకూడన్**

**పరమేష్టిపాలు గొన్నను, సరికూతురు చేసి కొడుకు చయ్యన కల్గున్**

యీ పద్యంలో స్త్రీ నామాక్షరాలను 7తో హెచ్చించి అప్పటి తిథిని కలిపి 'ఆ' మొత్తమును, 9తో బాగించాలి. పద్యంలో 7వ అంకెను చెప్పి 9ని బ్రాకెట్‌లో వుంచారు. దానిని పరమేష్టిగా వర్ణించారు. అనగా 9ది బ్రహ్మసంఖ్య పరమాత్మ అని భావం యిది నన్ను ఆకర్షించింది. బాగా బ్రహ్మ శ్రీ ఉమామహేశ్వర పండితులు రచించిన హిందూమత గ్రంథములలోని దైవమతం, ముక్తిమార్గం అను గ్రంథాలలో 9వ ఎక్కం వేసి చూపి దాని గొప్పతనమును మహిమను చూపి, 9వ సంఖ్యను దైవంగా వర్ణించారు. ముక్తి మార్గంలో యుగాలు 4 మహాయుగం, 71 యొక్క

మహాయుగాలు మనుకాలం యుగసంధి। ప్రపంచ వయస్సు, అన్ని అంకెల సారాంశం. 9 సంఖ్యగా చూపించారు గాన, 9దిని, పరమాత్మగా భావించి, నాకు కల్గిన భావాలను నేను సేకరించినవిషయాలను నాకు భగవంతుడు అనుగ్రహించిన, జ్ఞానంతో 108 పద్యాలలో వ్రాశాను. 108ని కూడితే 9వ వస్తుంది. దీనిని శతకం అని కొందరు అనుకుంటారు. యిది శతకము కాదు. నవబ్రహ్మ చరిత్ర శతకము అనగా ఒకే వృత్తము. మకుటము వుండాలి కదా. యిది నాల్గైదు రకాల పద్యాలలో వున్నది కాన యిది శతకము కాదు. చరిత్ర నేను దీనిని మన పూర్వ సంప్రదాయానుగుణంగా పరమశివుడు, పార్వతికి చెప్పినట్లుగా దానిని శ్రీ సూతమహర్షి శౌనకాది మహర్షులకు చెప్పినట్లుగా వ్రాశాను. యీ నవబ్రహ్మ చరిత్రను ఈ విధముగా వ్రాయుటచే వ్యాసప్రోక్త పురాణాలకు ఏ మాత్రము వ్యతిరేకము కాదని అనుగుణంగానే వుంటుందని, చాలా నమ్మకముతో భక్తి శ్రద్ధలతో వ్రాశాను. గాన పండితులు, కవులు, పెద్దలు, దీనిని స్వీకరించి, ఆదరించి, నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తాను. రచనలో కొన్ని దొసగులు వుండవచ్చు. వానిని మన్నించి క్షమించవలసిదిగా కోరుచున్నాను.

ఈ చరిత్రపై అభిప్రాయాలను కోరిన వెంటనే ఎంతో ఆదరాభిమానాలతో ప్రేమతో పరిశీలించి వారం రోజులలోనే చక్కని అభిప్రాయాలందించిన కవి పండితులైన వారందరికి భక్తి శ్రద్ధలతో శిరస్సు వంచి వందన శతములర్పించు చున్నాను. అభిప్రాయాలు సేకరించి 'కొన్ని నెలలైనను' కొన్ని కారణాంతరములచే గ్రంధముద్రణకు చాలా ఆలస్యము తప్పలేదు. దయతో నన్ను మన్నించ కోర్తాను. ఈ గ్రంధముద్రణ ఖర్చు భరించి గ్రంధమును చక్కగా అచ్చు వేయించిన నా పెద్ద కుమారుడు కె. రామకృష్ణ శర్మను వాడి కుటుంబాన్ని ఆయురారోగ్య ఐశ్వర్యాదులు ప్రసాదించి సర్వదా కాపాడవలసిందిగా భవంతుని ప్రార్థించుచున్నాను. ఈ పుస్తకాన్ని ఈ విధంగా రూపకల్పన చేసిన శ్రీ లక్ష్మీ ప్రెస్, గుంటూరు వారికి మనసారా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఇట్లు

-రచయిత-

తేది : 9-8-1999

**కామరాజుగడ్డ హనుమంతరాయశర్మ**

నా అర్హత

**ఆధ్యాత్మిక చింతన, స్వధర్మపాలన**

శ్రీరామ రక్ష

# ఆనన్దాభినందనములు

శ్రీయుత కామరాజుగడ్డ హనుమంతరాయ శర్మగారు నాకుచిరకాల మిత్రులు. సత్సంతాన సౌభాగ్యవంతులు, దైవభక్తులు.

వీరు నవశబ్దము (9)ను గురించి నూతనముగా నవనవ్య చరిత్రమును ద్రాక్షాపాకముతో మృధుమధురముగా రచించిరి. నాకు వినిపించిరి. చాలా సంతోషము.

ఈ విషయమును ఇంతవరకు ఈ రీతిగా ఎవరును రచించలేదు. దైవానుగ్రహముచే వివిధ పద్యరీతులుగా పార్వతీ పరమేశ్వర సంవాద రూపమున రచించిరి.

లోగడ భజన కీర్తనలనుకమనీయ శైలిలో రచించి అచ్చు వేయించినారు.

భగవద్భక్తులు దాతలు ఈగ్రంధమును అచ్చువేయించి అందరు చదువుకొని ఆనందించుచున్నట్లు చేసిన కవిగారు, మీరు, మేము చాలా సంతోషమును పొందగలము.

ఇట్లు
సర్వజనహితాభిలాషి
**శ్రీ మద్భాగవతల లక్ష్మీ నరసింహాచార్యులు**
రావి అనంతవరం,
రేపల్లె మండలం – గుంటూరు జిల్లా
19-6-1996

# శ్రీ నవబ్రహ్మ చరిత్ర

శ్రీ కామరాజుగడ్డ హనుమంతరాయ శర్మగారు వయోవృద్ధులే గాదు, జ్ఞాన వృద్ధులు కూడ. వీరు ఉపాధ్యాయ వృత్తిలో తల పండి విశ్రాంతులయిన లలిత కవులు. ధారశుద్ధి శోభితము, భాగవతభావనా భరితమునైన వీరి రచనలు వీరి ఆధ్మాత్మ తత్త్వ సంపన్నతకు నిదర్శనములై నిలచు ననవచ్చును. వీరు 1. మూర్తి త్రయ స్తవము, 2. శ్రీనివాసస్తవము, 3. శివస్తవము, 4. సాగరమధనము, 5. శ్రీ సత్యదేవస్తవము అనెడు స్తవరూప లఘుకృతులును, 1. శ్రీ మద్రామాయణ సుధాసార శతకము, 2. ఏకదంత శతకము, 3. శంభుశతకము, 4. కనకదుర్గ శతకము, 5.కృష్ణ శతకము, 6. నృశింహ శతకము - అను శతక గ్రంధములను రచించి యుండిరి. ఇప్పుడీ శ్రీ నవ బ్రహ్మ చరిత్రమును రచించిరి.

"నవ బ్రహ్మ చరిత్ర" నవ యనగా తొమ్మిది బ్రహ్మయనగా సృష్టికర్త. బ్రహ్మమనగా సత్యము, తత్త్వము చిత్ స్వరూపమని యర్ధములు. బ్రహ్మ బ్రహ్మము- ఈ రెండును నకారాన్త బ్రహ్మన్ శబ్ధ నిష్పన్నము లేగాని 'బ్రహ్మ' రూపము పుంలింగము, 'బ్రహమ్మము' రూపము నపుంసక లింగము. నవబ్రహ్మచరిత్ర మనగా తొమ్మిది యనెడు బ్రహ్మ యొక్క చరిత్ర యనియు, తొమ్మిది యనెడు చిత్ స్వరూపము యొక్క చరిత్రమనియు రెండు విధములుగ సమన్వయమగును. 'చిత్' అనగా జ్ఞానము, జ్ఞాన రూపమగు ఆత్మయు పరమాత్మ సంకేతములు కనుక నవబ్రహ్మ చరిత్రమనగా తొమ్మిది యను పరమాత్మయొక్క చరితమని భావము.

కాగా రచయిత శ్రీ కామరాజుగడ్డ హనుమంతరాయ శర్మగారు పౌరాణిక గాధలకు వలెనే ఈ చరిత్రమును కూడా నౌమిశారణ్యమున చేయు సత్రయాగ సందర్భమున సూతమహర్షి శౌనకాది మహర్షులు కోరికపై తొమ్మిదియను అంకె యొక్క త్త్వ మహిమను - పూర్వము పార్వతికి పరమేశ్వరుడు చెప్పినట్లుగ వివరించెనని చెప్పిరి.

తొమ్మిది యనెడు అంకెను గూర్చి పార్వతిదేవి పరమ శివుని కొన్ని ప్రశ్నలడిగినది. 1. తొమ్మిద ఇయనగా అంకెలలో గల తొమ్మిది యేనా? 2. ఆ తొమ్మిది పరబ్రహ్మ మెట్లయినది? అంకెలలో చేతనము లేవి? అచేతనము లేవి? చేతనములు జడములను సమానమా? అంకెలన్నిటిలో ఒక తొమ్మిదికే బ్రహ్మమను పేరెట్లు కల్గినది? రామకృష్ణులు పుట్టిన నవమి అష్టమిలను కష్టతిధులందు రేల? కేశవ నామములలో శ్రీరాముని నామమెందుకు లేదు? శ్రీకారము ఓంకారము రెండును సమానము లేనా? తెలియజెప్పుమని కోరగా ఆమె ప్రశ్నలకు సమాధానముగ తొమ్మిది అంకె యొక్క తత్త్వమును తెలియ జెప్పుటే ఈ కృతి పరమార్థము.

తొమ్మిది యనగా అంకెలలో గల తొమ్మిది యే యగును. అంకెకు సున్న కలసినచో విలువ పదిరెట్లగును కనుక "శక్తులు సున్నలో నణగి యుండె" 17. సున్నను జడమని, పూర్ణమనియు అందురు. జడము చేతనము కలియుటే పరమాత్మ. అట్లే జడసూచకమైన సున్నయు చైతన్య సూచకమైన ఒకటియు కలిసి తొమ్మిదియైనది. కనుక తొమ్మిది పరబ్రహ్మ స్వరూపమని భావన. అంతేకాదు. చైతన్య సూచకమైన ఒకటి సర్వశక్తులను ఇముడ్చుకొని గుండ్రనై సున్నయగుటచే "సున్నలొ చైతన్య శక్తి చూడంగ లయమై" - 23 యున్నదని సూచన. ఈ సందర్భమున -

"తొమ్మిదనగ బ్రహ్మ తొమ్మిదియే వాణి
తొమ్మిదనగ విష్ణు తొమ్మిది లక్ష్మి
తొమ్మిదనగ నేనె తొమ్మిదియే నీవు
నెమ్మదరయగౌరి నీకె తెలియు" నని

శంకరుడు పార్వతికి చెప్పుటచే తొమ్మిదియను అంకెయొక్క తత్త్వము బోధపడుచున్నది. అందులకే

నవనవ, నవనవ, నవనవ
నవనవ, నవనవ యటంచు నవనవయనుచున్ 18

నవనవ నవనవనవయన

నవశక్తియె నరుల బ్రోచు నవవిధములు గన్-21

అని కవిగారి ప్రబోధము. శ్రీకారము, ఓంకారము, నవకారము కూడ సమఫలదాయకములని కవిగారి సూచన - 28

రామకృష్ణావతారములు రెండును గొప్పవే కాగా పూర్ణ అవతారుడైన కృష్ణుడు పుట్టిన అష్టమి తిథికి సంకేతమైన "8"లో రెండు పూర్ణములిమిడి యుండుట చేత అధిక శక్తిమంతమైనదనియు పల్కెను. రాధాకృష్ణులకు, సీతారాములకు, పార్వతీ పరమేశ్వరులకు, వినాయకునకు - 67. శ్రీకార ఓంకారములకును - తొమ్మిది అంకెతో అభేదమును సూచించి నవశబ్దతత్త్వమును సూచించుట జరిగినది. తుదకు పై అందరితో అన్నింటితో, శ్రీ సత్యసాయికి గూడ అభేదము చెప్పి 74, 75, 76 నారు సత్యసాయిభక్తుడైన శ్రీ హనుమంతరాయ శర్మ.

ఇట్లు తొమ్మిది యొక్క బ్రహ్మ తత్త్వమును పలుత్రోవల పొసగించిన శ్రీ హనుమంతరాయ శర్మగారి పారమార్థిక చింతనాసక్తతకు నమోవాకములర్పించుచు

"మంగళము శబ్దశక్తికి మంగళంబు
మంగళము నాదశక్తికి మంగళంబు
మంగళము ప్రణవ మునకు మంగళంబు
మంగళము నవశక్తికి మంగళంబు"

ఇట్లు

**జక్కరాజు నరసింహారావు**

తెలుగు లెక్చరర్, హిందూకాలేజి
గుంటూరు.

-స్వస్తి-

# అభినందనాంజలి

పద్య ప్రబంధాల్లో యాగ్రంథమొకఅపూర్వ ప్రయోగము. ఇందులోని నాయకుడు సాక్షాన్నవబ్రహ్మయే. ఇంతవరకుయెవరికీ తెలియక, మరుగున పడివున్న ఒకానొక విషయానికి సంబంధించిన యెన్నో విశేషాలను కనుగొని ఎన్నియో గ్రంథాలను పరిశోధించి, చాలా పరిశ్రమ చేసి, వ్రాసిన కవి పండితులు బ్రహ్మశ్రీ హనుమంతరాయ శర్మగారు యెంతైనా అభినందనీయులు.

నవనారసింహాలు, నవఖండాలు, నవధాన్యాలు, నవచక్రాలు, నవావరణలు, నవరసాలు, నవవ్యాకరణాలు మొదలైన విశిష్ట విషయాలన్నీ నవ సంఖ్యను కలిగి వుండడంలోనే ఈ సంఖ్యకు గల ప్రాశస్త్యమేమిటో తెలుస్తున్నది.

ప్రాచీన కాలం నుండి నవ సంఖ్యకు ప్రాముఖ్యమెంతో వున్నదని వినడమే కాని "తొమ్మిది"కి యిన్ని "మహిమలు"న్నాయని యీ గ్రంథం ద్వారా మాత్రమే నాకు తెలిసింది. ఒక సంఖ్యకు గల మహాత్మ్యాన్ని వివరించే గ్రంథమే నేనింతవరకూ చూడలేదు.

కలియుగంలో దినదినమూ క్షీణిస్తున్న ఆస్తిక్య భావనమూ పద్య కవిత్వాన్నీ పునరుద్ధరించడానికి తమవంతు బాధ్యతను నెరవేర్చారు కవిగారీ అద్భుత గ్రంథం ద్వారా.

దాదాపుగా "నవ" సంఖ్యకు సంబంధించిన విషయాలన్నీటినీ స్పృశించారు కవి.

గీ. నవమి జన్మింప శ్రీరాముడవనియందు
గొప్ప బేర్పడసెన? లేక గొప్ప పేరు
నవమిబడసెన? శ్రీరాముడవతరింప
నూహకందని విషయంబు సుర్వియందు

నిజానికీ పద్యమొక్కటి చాలు "నవ" సంఖ్యా మహాత్మ్యాన్ని గ్రహించడానికి

ఆ.వె. తొమ్మిదనగ బ్రహ్మ తొమ్మిదియే వాణి
తొమ్మిదనగ విష్ణు తొమ్మిది లక్ష్మి
తొమ్మిదనగ నేనె - తొమ్మిదియే నీవు
నెమ్మదరయ గౌరి - నీకె తెలియు

ఈ పై పద్యం ద్వారా "నవ" సంఖ్యను త్రిమూర్త్యాత్మకంగా వర్ణించడమే కాక, ముగురమ్మలనూ "నవ" సంఖ్యలోనే ప్రతిపాదించి, ఆ సంఖ్యా మహిమ నిమ్మహికి చాటి, మహోపకారం చేశారీ కవి.

ప్రణవాన్నీ, శ్రీకారాన్నీ కూడా నవ సంఖ్యాత్మకంగా పద్యాల్లో ప్రతిపాదించిన తీరెంతో ప్రశంసనీయంగా వున్నది.

"నవ సంఖ్యయె బ్రహ్మనిజము నిజమని" నిరూపించిన కవి బ్రహ్మ వాక్కు ముమ్మాటికీ నిజము. ఈ అంకెకిన్ని మహిమలున్నవి కనుకనే "నవ" శబ్దంసార్థకనామధేయమైనది.

"నవ" మహాత్మ్యాన్ని వెలుగులోనికి తెచ్చి పాఠక హృదయాల్లో "నవ" కాంతిని నింపిన కవి వరేణ్యులు బ్రహ్మశ్రీ కామరాజుగడ్డ హనుమతరాయ శర్మగానికి శతసహస్ర ప్రణామాలను సమర్పించుకుంటూ.

విద్వజ్జన విధేయుడు
**ముడుంబై లక్ష్మీనరసింహాచార్య**
సంస్కృతాధ్యాపకుడు
కేంద్రీయ విద్యాలయము
ఆయుధ కర్మాగారము
ఎద్దుమైలారము
మెదక్ జిల్లా
ఆంధ్రప్రదేశ్.

# శుభకామనా

1. "నవ" యను శబ్దరత్నమును
నాందింగఁబేర్కొని వేద సూక్తులన్

2. "స.విపుల సాహితీలసిత
శాస్త్రసుశోధితనూత్న మార్గముల్

3. "నవ" రుచులీనునట్లుగను
నాకధునీని భపూతతత్వమున్

4. "నవ" యను శబ్దజాల పరి
ణామ మహోన్నత సర్వశాఖలన్

5. "నవ" పరిశీలనన్ "ప్రణవ"
నాదము నందలి నర్మధర్మమున్

6. "నవ" యను బ్రహ్మసంకలిత
నగ్న చరాచరకోటి వృత్తులన్

7. "నవ" యను బ్రహ్మతత్వమును
నమ్మినవారికింగల్గు వెల్గులన్

8. "నవ" తరమందు జాగృతిని
నమ్మకమున్ "నవ" శబ్దమందునన్

9. "నవ" మియె సర్వలోకనుత
నామసురామ భవిత్వమందుటన్

10. "నవ", తరమందు జాగృతిని
నమ్మకమున్ "నవ" శబ్దమందునన్

11. యువ, తరమందు యత్నమును
యోగమహోత్వసుతత్వకాంక్షలన్

12. ఇవి,యవి, పేయినేల, సకలేశ్వర సృష్టి
నవా, ష్తరీతులన్

13. 'వి', "నవ", రీతిలోఁ బొదిగి
ఈశ్వర గౌరిసునాదమౌనటుల్

14. ప్ర విమల పద్ధతిన్ సకల
పండిత పామర రంజకంబుగా

15. "నవ నవ, శోభలన్ బలికె
నమ్రముగా శుభక్రమ రీతిలో

16. "నవ, పరివోధకుండు శుభ
నాముడు ధీనిధి కామరాజుగ

17. ధ్ద వనధి సౌముఁడౌ "హనుమ"
దంబమెఱుంగని 'భక్త దాసుడై' (రామ)

18. "నవ" పద శబ్ద "బ్రహ్మము - వి -
నమ్రుని బ్రోచుత "హన్మదార్యునిన్"

పరమహంస శ్రీ

డా॥ అగ్నిహోత్రం రామకృష్ణమాచార్యులు

పాటిబండ

పెదకూరపాడు (మం)

గుంటూరు (జిల్లా)

పిన్‌కోడ్ : 522402 (ఆం.ప్ర.)

# శ్రీ నవబ్రహ్మ చరిత్ర

శా. శ్రీ రమ్యంబగు నైమిశంబున ఋషుల్। శ్రీనాథుచారిత్రముల్
కారుణ్యామృత ధారలొల్కు పలుకుల్। కర్ణామృతంబానుచున్
సారాసార వివేకి సూతగనుచున్। సౌమ్యుల్ మునుల్ పల్కిరో
పారాశర్యమునీంద్ర శిష్య! నవశ। బ్దార్థంబు తెల్పుంగదే!॥ 1

మ. మునులన్ కన్గొని సూతుడిట్లనియెనో। పుణ్యాత్ములారాయిటుల్
మునుపీ యర్ధము భార్య గౌరి యడుగన్। ముక్తేశ్వరుండిట్లనెన్
మునులారా వచియింతు నేనదియె స। త్పుణ్యంపు చారిత్రమున్
వినుడీ సద్విషయంబు వీనులలరన్। విశ్వేశిబ్రోచున్మిమున్॥ 2

కం. శ్రీ శంకర శివశంకర
పాశాంకుశ నాగభూష। పాహి మహేశా।
నాశంకలు మిమ్మడిగెద
నాశంకలు తీర్చు స్వామి। నాథాయీశా!॥ 3

కం. తొమ్మిదిని బ్రహ్మమందురు
తొమ్మిది యెట్లౌను బ్రహ్మ। తొమ్మిదియనినన్
తొమ్మిది సంఖ్యలలోగల
తొమ్మిది యేనాయటంచు। తొలగవు శంకల్॥ 4

కం. చేతన జడములటంచును
భూతల సంఖ్యలను నేవి? భూతేశవిభో
భూతాధినాథ నాథా!
నాతలపులెరింగి తెలుపు। నటరాజ ప్రభో!॥ 5

కం. చేతన జడముల యందున
చేతనమే యెక్కువండ్రు। శివసర్వేశా!
చేతన జడములు సమ మా
నా తలపు లెరింగి పలుకు సతమందారా!॥ 6

తే.గీ. అంకెలన్నియు యొక్కటే। యగునుగాదె
గాన ప్రతియొక్క యంకెపై। గలవు కొన్ని
పేర్లు తొమ్మిది పైకూడ। పేర్లు గలవు
అట్టియెడ తొమ్మిదికెయేల। నజుని పేరు? 7

తే.గీ. రామకృష్ణులు పుట్టిన। రమ్యమైన
తిథులుగద నవమ్యష్టముల్। దేవనాథ
అట్టి తిథులను పనికిరా। వందురేల
మంచి పనులకు పండితు। లెంచరేల? 8

కం. కేశవనామంబుల, లో
కేశుని శ్రీరామనామ। మెందుకు లేదో
హేశంకర వినిపింపుము
ఈశా। నాప్రాణనాథ। యీశ్వర దయాతోన్ 9

కం. శ్రీకారోంకారంబుల
శ్రీకారమె తక్కువండ్రు। శివసర్వేశా
శ్రీకారోంకారంబులు
ఏకాకారంబులగున! ఎట్లగునాథా? 10

కం. తను నడిగిన పార్వతిగని
వినిశంభుడు మోదమంది। వినుమనిపలికెన్
కనుగొంటిని నీ హృదయము
వినిపించెద విశదముగను। వినుమోదుర్గా॥ 11

కం. తొమ్మిది తొమ్మిది తొమ్మిది
తొమ్మిది తొమ్మిది యటంచు। తొమ్మిది యనుచున్
తొమ్మిది తొమ్మిది యనుచో
తొమ్మిదియే నరులఁబ్రోచు। దోషములడచున్॥ 12

కం. తొమ్మిది యనగా బ్రహ్మము
నెమ్మనమున నరపి జూడ। నేరరు జనముల్
నమ్మరు పెద్దలు చెప్పిన
నిమ్మహిలోను రకజూతు। రిహగర్తమునన్॥ 13

కం. నవయనగా తొమ్మిదియగు
నవయనగా నూతనంబు। నాతిరో వినుమా
నవనవ యనగా వడలని
నవనాగరికంబనంగ। నగుఁక్రొత్తదిగాన్। 14

కం. అంకెలు తొమ్మిది యేగద
అంకెలకును సున్నగలియ। నగుగాపదిరె
ట్లంకెలను సున్న వీడిన
అంకెలు తామెట్లు పెరుగు। నట్లనెయుండున్॥ 15

తే.గీ. సున్న లేకున్నసంకెలు। చూడచూడ
నొకటి నుండియు తొమ్మిది। వొచ్చు వరకు
పెరుగు గాదె విచారింప! నెరుగునొక్కొ
యంకెలేకున్న సున్నతా। నల్లెయుండు॥ 16

తే.గీ. కనుక సంకెకె ప్రాధాన్య మనగవలయు
నంతమాత్రాన సున్నను। నంత విలువ
లేనిదానినినగా జూడ! లేము నరయ
సున్నలోశక్తి లేకున్న। సున్న కలియ
నంకె వందలు వేలుగా। నగుట యెట్లు?
నరయ శక్తులు సున్నలో నణిగియుండె॥ 17

తే.గీ. పుడమి సున్నకు మరుపేరు। పూర్ణమంద్రు
పూర్ణమన నిండియుండుటే। పూర్తిగాను
అన్నియంకెలన్ చైతన్య। మనెదరట్లె
సున్ననెదరు జడమని। సూరిమతులు॥ 18

కం. సున్నయు చైతన్యంబును
భిన్నముగా నుండునెపుడు। ప్రీతినిరెండున్
తిన్నగకలియుటె తొమ్మిది
యెన్నగ పరమేష్ఠిగాదె। నిది నిజమవనిన్॥ 19

కం. చిత్రము తొమ్మిది చరితము
చిత్రము తన్మహిమచూడు। చేతనమరయన్
చిత్రము మదిలో దలచిన
మిత్రము మాతయునుపితయు। మీదట ప్రజకున్॥ 20

కం. నవనవ, నవనవ, నవనవ
నవనవ, నవనవ యటంచు। నవనవయనుచున్
నవనవ నవనవనవయన
నవశక్తియె నరుల బ్రోచు। నవ విధములుగాన్॥ 21

ఆ.వె. తెలుగు రచనలందు। నిలలోని సంఖ్యలన్
కలసి మెలసి యుండు। గాంతుమెపుడు
సున్నగాన దాని। సున్ననవచ్చునా?
సున్నయనిన తెలివి సున్నగాదె?॥ 22

కం. సున్నను సర్వప్రపంచము
సున్నను చైతన్య శక్తి। చూడగ లయమౌ
సున్నను సర్వము గలదని
సున్నను పూర్ణమను వారి। సురలనవచ్చున్॥ 23

తే.గీ. సున్న చైతన్యమీరొండు। చూడరెండు
గాగ కన్పించు నరయుగా। గాంచగలము
రెండు నొక్కటియేయని। రెంటియందు
భేదమిసుమంత లేదని। భేదమెంచ
పాడిగాదని నవసంఖ్య। గూడియున్న
రెంటి విడదీయ। నడుగంటు। రెంటి విలువ॥ 24

కం. దేవీ భాగవతంబును
భావమును, గ్రహించి చదువ। భగవతికి జగ
జ్జీవన దాత కభేదము
పావన హృదయమున తెలియు॥ పరదేవి కృపన్॥ 25

తే.గీ. అండమనినను, ప్రకృతియు। ననఁగ పూర్ణ
మనిన సున్నయనంగను। మాయనగ
గోళమనినను బ్రహ్మాండ కోటులన్న
జగమటన్నను నర్థముల్। సమముగాదె॥ 26

తే.గీ. పానుపట్టము లింగమున్। పార్వతీశివు
లగు నటంచును దైవజ్ఞు। ల నెదరట్లె
సున్న చైతన్యమొకటియు। చోద్యమగును
కలియ తొమ్మిది యనెదరో। కమలనేత్రి
తొమ్మిదన పరమేష్ఠియే। దూరమరయ॥ 27

కం. శ్రీకారోంకారంబుల
ఏకాలమునన్ స్మరింప। నెదలో దలచన్
శ్రీకాముడెట్టి ఫలమిడు
నీకా ఫలమిచ్చు నతడు। నిల నవయనగన్॥ 28

ఆ.వె. శ్రీకరంబునైన శ్రీకారమునకెట్టి
శక్తిగలదొయట్టి। శక్తి కలదు
సంఖ్యలందు నవను। సంఖ్యకు చిత్రమౌ
వలదుసందియంబు। వలదువలదు॥ 29

ఉ. తొమ్మిది యెక్కమున్ జదువ। తొమ్మిది సంఖ్యయె వచ్చు చిత్రమౌ
తొమ్మిది సంఖ్యలున్ గనిన। తొమ్మిది వచ్చుట నబ్బురంబగున్
తొమ్మిది సంఖ్యలున్ గలుప। తొమ్మిది యేగద వచ్చుచూడగా
తొమ్మిది శక్త్యపారమని। తోయరు హాక్షుడు పల్కెపుత్రుతోన్॥ 30

ఆ.వె. కంఠ మాలయందు। కలవు నూటెన్మిది
పూసలెన్నవాని। పుడమి కలుప
పదియు నెన్మిదగును। వాటిని కలుపగా
తొమ్మిదగును గాదె। నెమ్మదరయ॥ 31

108 - 9
54 - 9
27-9
189-18

ఆ.వె. కంఠ మాలయందు। కలిగిన పూసలన్
సగము చేసి వాని। సగము చేసి
కలుపవచ్చు ఫలము। కనగ తొమ్మిది గద
మూటి కలుప ఫలము। మూడు మూళ్లు॥ 32

చం. కలియుగ సంఖ్యనున్గలుపగా। నవసంఖ్యయెవచ్చుచూడగా
ఫలితము తొమ్మిదౌనుగద। పైయుగ సంఖ్యల వేరువేరుగా
కలిపిన నాల్గు సంఖ్యలను। కల్పిన వచ్చెడి సంఖ్య మొత్తమున్
తెలియగ తొమ్మిదౌనుగద। తేలెనుపోనవ సంఖ్య బ్రహ్మమౌ॥ 33

తే.గీ. ఎన్ని విధముల జూచిన। యెట్లు కలుప
చిత్రముగ వచ్చు నవసంఖ్య। చిత్తమలర
బ్రహ్మసంఖ్యయె నవసంఖ్య। బ్రహ్మ సంఖ్య
నవ సుసంఖ్యకు భేదంబు। నవని లేదు
వేద సమ్మత మిది యంద్రు। వేదవిదులు॥ 34

17,28,000– కృతయుగం
12,96,000– త్రేతాయుగం
8,64,000 – ద్వాపరయుగం
4,32,000 – కలియుగం
43,20,000

సీ. అక్షౌహిణీసేన। యన రథాలేనుగుల్
కాల్బలాల్ గుఱ్ఱాలు। గల్గియుండు।
వీనిసంఖ్యల విడివిడిగ కల్పినయంత
నవసంఖ్యయే వచ్చు। నాతిగనుచు।
సంఖ్యల నాల్గిటిన్। చక్కగా కలిపిన
నవ సంఖ్య వచ్చునో। నళినవేత్రి।
నిది యొక యక్షౌహి। ణీసేన సంఖ్యయే
పదునెన్మిదరయుగా। వచ్చు నవయె॥

| | | |
|---|---|---|
| 21,870 | ఏనుగులు | 18 |
| 21,870 | రథాలు | 18 |
| 65,610 | గుఱ్ఱాలు | 18 |
| 1,09,350 | బంట్లు | 18 |
| 2,18,700 | అక్షౌహిణి | 18 |
| × 18 | | |
| 39,36,600 | -27-9 | |

కం. తొమ్మిది యెక్కము వలె మరి
యిమ్మహినే యెక్కమైన। యిముడగ వశమే
నెమ్మది జనులరసినచో
తొమ్మిది బ్రహ్మంబుగాదె। తోయజనేత్రి!॥ 35

తే.గీ. వేయిపై నూటపదహారు। వేసి దాని
సగము చేసియు దానిని। సగము చేసియు
మూటి విడివిడిగా కల్పు। మూడు మూళ్ళు
మూటి మొత్తము కలిపిన। మూడు మూళ్ళు
గాన తొమ్మిది పరమాత్మ। గౌరి నిజము.॥ 36

| | |
|---|---|
| 1,116 | - 9 |
| 558 | - 9 |
| 279 | - 9 |
| 1,953 | - 18 |

సీ. బ్రహ్మలు తొమ్మండ్రు। పరదేవి హస్తముల్
బదునెన్మిదరయుగా। వసుధ నవయె
నరమృగ పశుపక్షి। వరదేహములు జూడ
నవరంధ్ర నిర్మితాల్। నళినవేత్రి
తారలిర్వదియేడు। తగ చంద్రు భార్యలు
యజ్ఞోపవీతంబు। నరయ నవయె
నవరాత్రము లటంచు। నవరత్నము లటంచు
పలుకుచుందురు గాదె। కలిలో జనులు.

తే.గీ. నవమి బుట్టడె రాముడు। నగధరుండు
భక్తిమార్గాలు తొమ్మిదై। బరగలేదె
గాన నవ సంఖ్యకును సాటి। గనము నవని
నరయ నవసంఖ్యయే బ్రహ్మ। మనుట నిజము
నిజము నిజము నిజంబిది। నిజము నిజము॥ 37

సీ. నవ మండలములంచు। నవ ఖండము లటంచు
నవధాన్యము లటంచు। నవని వినమె
నవకోటి యాలయాల్ నవవర్షము లటంచు
నవ రసాలంచును। నవని వినమె
వ్యాకరణాల్ నవ। యట్లె గ్రహాల్ నవ
నవ నారసింహాలు। న్నవని వినమె
ఆవరణాల్ నవ। యట్లె కాలాల్ నవ
నవ దశల్ నవ పదా। లవని వినమె॥

తే.గీ. భారతము నందు గీతలో। పదునెనిమిది
సంఖ్యయే వచ్చు పలుమార్లు। ముఖ్యముగను
సూక్ష్మదేహంబునందును। చూడగలము
తత్త్వములు పదునెన్మిది। తరచిచూడ॥ 38

కం. నవచక్రస్థాయిని యన
నవ యావరణా లటంచు। నవకోటి యనన్
నవకాయ పిండివంటలు
నవసంఖ్యయె విశ్వమెల్ల। నాతిరొగనుమా! 39

కం. నవశబ్ద మెచట వినినను
నవశబ్దమె యెచట గనిన। నవనవలాడున్
నవశబ్ద మెచట కేగిన
నవశబ్దపు విశ్వరూపు। నాతిరొగనుమా॥ 40

తే.గీ. నవమి జన్మింప శ్రీరాము। డవనియందు
గొప్ప బేర్పడసెన? లేక గొప్పపేరు
నవమి బడసెన? శ్రీరాము డవతరింప?
నూహకందని విషయంబు। నుర్వియందు॥ 41

కం. తొమ్మిది ఎక్కపు ఫలితా 09
లిమ్మహి నాశ్చర్యకరము। లిరువరుసలలో 18
నెమ్మదిగన, పై క్రిందకు 27
36
సమ్మతిగన, క్రింద పైకి - సమమౌ రెండున్॥ 45 42

54
కం. తొమ్మిది యెక్కపు ఫలితాల్ 63
తొమ్మిదియునుకూడిచూడు। తొమ్మిదియగు। లో 72
81
కమ్మున తొమ్మిది సంఖ్యకు
90
తొమ్మిదియే సాటిగాదె। తోయరుహాక్షీ!॥ 495 - 9 43

కం. చుక్కల చంద్రుని కైవడి
నెక్కములను పోల్చిచూడు। నీభువియందున్
నిక్కముగా తొమ్మిదవది
చక్కగా రాజౌనుగాదె। సంఖ్యలలోనన్॥ 44

ఆ.వె. తొమ్మిదనగ బ్రహ్మ। తొమ్మిదియే వాణి
తొమ్మిదనగ విష్ణు తొమ్మిది లక్ష్మి
తొమ్మిదనగ నేనె। తొమ్మిదియే నీవు
నెమ్మదరయగోరి। నీకె తెలియు॥ 45

ఆ.వె. నేనె తొమ్మిదరయ। నీవును తొమ్మిదే
నీవె నేను నేనె। నీవు జగతి
నీకు నాకు భేద। నిసుమంతయును లేదు
దీని నమ్మువారె। దేవులవని॥ 46

ఆ.వె. నవమి సంస్కృతంబు। నవని తొమ్మిది తెన్గు
నవమి ప్రీతిగాన। నవమి బుట్టె
రామనామ దగుచు। రాజీవనేత్రుండు
నవమి రాములొకటె। నళినవేత్రి॥ 47

కం. శివరామకృష్ణ లనగను
శివకరులగు ముప్పురొకరే। సిరులొసగు సదా
శివరామకృష్ణయను నరు
శివములుచేకూర్చి బ్రోచు। సిలుగుల్ బాపున్ 48

ఆ.వె. రామకృష్ణ యనెడి। నామాలవలె నవ
నామ జపము చేయు। నరుని యొక్క
పాపరాశియెల్ల। భస్మమై వెంటనే
పాపరహితుడౌచు। పరముం గనును॥ 49

ఆ.వె. అంకెలన్నిగూడ। నమిత చైతన్యముల్
అంకెలనిన జీవులాత్మలగును
అంకెలందు నవమి। యధికమౌ పరమాత్మ
అట్టి నవమి నేనె। యగుదు దేవి॥ 50

ఆ.వె. ఈ చరాచరాది। యీరేడు లోకముల్
భూనభోంతరాళ। భూతములును
నవమి నణగియుండె। నవమియే బ్రహ్మంబు
అట్టి బ్రహ్మ నేనె। యగుదు గౌరి॥ 51

ఆ.వె. ప్రనవ అర్థమరయ। ప్రణవమై యలరారు
ప్రనవ ప్రణవములకు। ప్రగతి యెకటె
ప్రనవ ప్రణవమౌను। ప్రణవమే ప్రనవమౌ
ప్రణవ శబ్దమందు। ప్రనవ మిమిడె॥ 52

ఆ.వె. ప్రణవమునకు నవమి। ప్రాణంబు గావున
నవమి లేక ప్రణవ। మవని గలదె?
నవమి ప్రణవములకు। నవనిలో భేదంబు
లేదు లేదు లేదు। లేదు నిజము॥ 53

కం. ప్రణవమె ఓంకారంబగు
అణకువ పరికించి చూడ। నగు బ్రహ్మంబున్
గణుతింతు రార్యులందరు
ప్రణవమె యజ విష్ణు హరులు। పార్వతి వినవే! 54

ఆ.వె. అ, ఉ, మ యనెడి మూడు। యక్షరాల్ కలిసిన
ఓం యటంచు బలుకు। ఓం యనంగ
అజుడు హరియు హరుడు। నగుగాదె సరయగా
దాని మహిమ తెలియ। దక్షు లెవరు? 55

ఆ.వె. ఓనమాలు పలికె। నోంకార మహిమలు
ఓం యనంగ శివుడు। ఓం యనంగ
రామచంద్రుడగును। రమణిరో వినుమింక
రామకృష్ణ శివులు। ప్రణవతనులు॥ 56

ఆ.వె. నియమ నిష్ఠ గలిగి। నియతితో ప్రణవంబు
జపము చేయువారి। సర్వపాప
రాసులెల్ల భస్మ। రాసులౌ నిజమది
నవపదంబుఁజేర్చు। నరుల దేవి! 57

ఆ.వె. ప్రణవ మక్షరముల। ప్రాణాక్షరంబగు
గాన దానినుండి। గలిగె శబ్ద
మవని శబ్ద మనగ। సరయ నాదముగాదె
నాదమగును బ్రహ్మ నాతి నిజము॥ 58

తే.గీ. శివపురాణము చెప్పెను। శివుని మహిమ
శివుడె ప్రణవము ప్రణవమే। శివుడటంచు
శివుడె శక్తియు శక్తియే। శివుడటంచు
వారిలో భేదమే లేదు। వారలొకరె
అర్ధనారీశ్వరుండన। నర్థమిదియె!! 59

ఆ.వె. అవని గల్గునట్టి। నన్ని మంత్రములకు
అన్ని నామములకు। నాదియందు
ప్రణవ మమరుగాదె। ప్రణవాక్షరము లేక
మంత్రనామములకు। మహిమ గలదె? 60

తే.గీ. ప్రణవ మేమంత్రమున చేర్చ। బడి యలరునొ
అట్టి మంత్రమె మంత్రమౌ। నవనియందు
ప్రణవ మేమంత్రమున చేర్చ। బడదొ గౌరి
అట్టి దానిని మంత్రంబు। ననవు శ్రుతులు।। 61

తే.గీ. దేవతలయందు శివుడును। భూపలయము
నందు రాముడు నిర్వురు। నతులసములు
అర్ధనారీశ్వరుండయ్యె। హరుడు। రాము
డర్ధనారీశ్వరుడె! సీత కంకమిచ్చి।। 62

తే.గీ. రాముడే సీత। సీతయే। రాముడట్లె
శివుడె పార్వతి। పార్వతే। శివుడు నిజము।
వారిలో। భేదమే లేదు। వారలొకరె।
వారిలో భేదమెంచుట। పాపమౌను।
నిజము నిజము నిజంబిది। నిజము నిజము।। 63

సీ. అవనిలో శుభకార్య మశుభకార్యములందు
మొదట కేశవనామ। ములు పఠింత్రు
అందులో శివనామ। మెందు గానగరాదు
శ్రీరామ నామమె। లేదు చూడ
రామనామము విష్ణు। నామమే యైనను
అందులో గనరాదు। యుద్భృతంబు
అట్టి కారణమేమొ। గట్టిగా వివరింతు
శివ రామ నామముల్। శివకరములు

తే.గీ. నేనె రాముడు। రాముడే నేను గాన
మాకభేదంబు। బేధంబు। మహిని లేదు
పోలికలు కూడ నొక్కటే। పోల్చిచూడ
అధికులము విష్ణునామాల। కవని నిజము
గాన మానామములు యందు। గానరావు॥ 64

తే.గీ. శంకరుడనేను రాముని। స్మరణసేతు
నను స్మరించును రాముడు। వినుము దేవి
గానమాయందు భేదంబు। గాంచతగదు
భేదమెంచిన నరకాబ్ధి।నీదవలయు॥ 65

ఆ.వె. జడలు దాల్తునేను। జడలు దాల్చెను రాము
డాలిలేక నేను। నలమటింప
నట్లెరాముడింతి। నడవిని। కోల్పోయి
ఆలమటించలేదె। యాలికొరకు!॥ 66

ఆ.వె. రాధ కృష్ణులనగ। సీతరాములనంగ
గౌరి శివులనంగ। గణపతనగ
పేర్లు మార్చెగాని। వీరందరొకరని
తెలివియున్నవారు। తెలియగలరు॥ 67

తే.గీ. రామ కృష్ణావతారముల్। రమణిరావిను
అన్ని యవతారములకంటె। నధికమనిరి
వారు పూర్ణావతారులు। వారియందు
కృష్ణుడన పరిపూర్ణుడు। విష్ణువెయగు॥ 68

తే.గీ. అట్టి పరిపూర్ణ బ్రహ్మంబె। యర్ధరాత్రి
అష్టమీ తిథియందున। నవనివెలసె
అష్టమీ యన యెనిమిది। యగునుగాదె?
ఎనిమిదిని రెండు పూర్ణము। లిమిడియుండె॥ 69

తే.గీ. అట్లె చైతన్యములు రెండు। అందుయిమిడె
కొలది మార్పుతో పూర్ణముల్। కోమలివిను
చేతనాలుగ మారెను। చింతసేయ
వాని చూచిననివి లేవు। వీని చూడ
అవియులేనట్లు కన్పించు। అగజ వినము॥ 70

తే.గీ. విష్ణువర్ధ రాత్రంబున। కృష్ణుడనగ
నవతరించెను యష్టమి నవములందు
అష్టమీ నవములు రెండు। నవనియొకటె
అట్లె శ్రీరామకృష్ణులు। నవనియొకరె॥ 71

తే.గీ. ఆది శంకరాచార్యులు। అధికభక్తి
కృష్ణుని జగద్గురుండని। విష్ణుడనుచు
పల్కెగాని శ్రీరాముని। పల్కెనొక్కొ?
గాన కృష్ణుని పరిపూర్ణు। గా 'గ' గనుము॥ 72

ఆ.వె. అర్ధరాత్రియనిన। అష్టమీ నవములు
కలిసిమెలిసియున్న। కాలమగును
అట్టి కాలమందు। నావిర్భవించుట
పరమపూర్ణుడనుచు। నెరుగు కృష్ణ॥ 73

కం. శివసాయి రామకృష్ణులు
శివకరులగు నల్వురొకరే। సిరులొసగెదరా
శివసాయి రామకృష్ణులు
భవమణచుచు ముక్తినొసగు। భక్తులకెపుడున్ 74

తే.గీ. రాముడే సాయి। సాయియే। రాముడగును
కృష్ణుడే సాయి। సాయియే। కృష్ణుడరయ
శంకరుడె సాయి। సాయియే శంకరుండు
శక్తియె సాయి। సాయియే। శక్తి నిజము॥ 75

ఆ.వె. శివుడు శక్తి కలసి। శివశక్తియనబడు
సత్యసాయి అట్టి। శక్తి నిజము!
సాయినేనుగాక। సామాన్యనరుడైన
అతని శక్తులెట్లు। నాశ్రయించు? 76

తే.గీ. నిర్వికార నిరంజన। నిరుపమగుణ
నిరవయవనిరుపద్రవ। నిర్విశేష
నిగమ వినుత నిరామయ। నిరుపమాన
నిఖిల జగదాశ్రయ నిరీహ। నిగమవేద్య॥ 77

తే.గీ. సుగుణ సాకార నిరుణ। శక్తియుక్తు
డైన సాయి చిదానందు। డతులశక్తి
యుతుడు శ్రీ సత్యసాయియే। ముక్తినిచ్చు
వానిగా నన్నెవానిగా। పార్వతిగను॥ 78

తే.గీ. సాయియే బ్రహ్మవిష్ణులు। సాయె నేను
సాయియే సూర్యచంద్రులు। సాయెసురులు
సాయియే పంచభూతాలు। సాయె దిశలు
సర్వభూతాంతరాత్మగా। సాయినెరుగు 79

తే.గీ. సర్వజగదంతరాత్మ శ్రీ సత్యసాయి
సర్వదేవాదిదేవుడే సత్యసాయి
సర్వమాతలమాత శ్రీ సత్యసాయి
నిత్య సత్యస్వరూపుడే సత్యసాయి॥ 80

ఆ.వె. సత్యసాయి నిత్య సత్యస్వరూపుండు
సత్యసాయి ప్రేమ సాగరుండు
సత్యసాయి ధర్మ సారస్వరూపుడు
సత్యసాయి శాంతి స్థాపకుండు॥ 81

కం. సాయియే ఓంకారంబగు
సాయియే శ్రీకారమగును సాయే ఆత్మా
సాయియే జడచేతనములు
సాయియేభువి దివియు గౌరి సాయెనవమియా॥ 82

కం. శ్రీకారోంకారంబులు
ఏకాకారంబులగును నెదపరికింపన్
సాకారనిరాకారాల్
ఏకాలమునన్ స్మరింతు నెపుడు ముదముతోన్ 83

కం. జడచేతనములు రెండును
విడివిడిగా నుండవెపుడు వేడుక మీరన్
కడలితరంగాల్ విధమ్ము న
పుడమిని తా కలిసిమెలసి పుణ్యులబ్రోవున్॥ 84

కం. శ్రీకారమె ఓంకారము
శ్రీకారమె ఓం యటంచు చెపుదురు విబుధుల్
శ్రీకారోంకారంబులు
ఏకార్థమైనయపుడు ఏకము గాంచున్॥ 85

కం. ఓం ఓం ఓం ఓం ఓం ఓం
ఓం ఓం ఓం ఓం యటంచు। ఓంఓం యనుచున్
ఓం ఓం ఓం ఓం యనుచో
ఓంఓం యక్షరమెనీకా। ఓయనిపలుకున్. 18 86

కం. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
శ్రీ శ్రీ శ్రీ శ్రీ యటంచు। శ్రీశ్రీ యనుచున్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ యనుచో
శ్రీశ్రీ యక్షరమె నీకు। సిరులందించున్. 18 87

ఆ.వె. వల్మికోద్భవుండు। వ్రాసెరామాయణం
బదియు సప్తసంఖ్య। నను సరించి
గాని నవమి సంఖ్య। గైకొనడాయెవా
ల్మీకి చిత్తమరయ। లేము గౌరి॥ 88

తే.గీ. వ్యాస భగవానుడందించె। భారతమున
నమితశక్తి సంపన్నమౌ। నజుని సంఖ్య 9
నజుడనగ బ్రహ్మమౌగాదె - యట్టి సంఖ్య
బ్రహ్మమే బ్రహ్మమేయంచు। బల్కు శ్రుతులు॥ 89

సీ. బ్రహ్మా వైవర్తంబు। బ్రహ్మదేవుని యొక్క
ఆయువు నూటెన్మి। దనుచు చెప్పె
రాసమండలమందు। రాధిక మొదలగు
తొమ్మిది, లక్షల। తోయజాక్షు
లకు నిర్వురిర్వులై। రాసేశ్వరుడు లీల
రాసమండల స్త్రీల। రమణుడగుచు
నీరీతిగా తాను। నిర్వదింటికిరెండు
తక్కువ లక్షలై। యక్కజముగ
వ్రజసుందరులనెల్ల। రంజింపజేసెను
వీనిభావము గౌరి। తేటబరతు

తే.గీ. గోపికలు మంత్రదేవతల్। గోపబాలు
డైన కృష్ణుడు పరిపూర్ణ। మైన జ్యోతి
అట్టి జ్యోతిలో లీనమై। రబలలంతె
గనుక నద్దాని మానవ। మనుట తప్పు
రాసమండల భావంబు। రమణివింటె. 90

ఆ.వె. పైన చెప్పినట్టి।పద్యమందున భావ
మది గ్రహించినావె। యాదిదేవి
అందు। బ్రహ్మసంఖ్య - యను నవసంఖ్యయు
న్నది। గ్రహించి చూడు। మదిని దేవి।। 91

కం. తారలు నిరువది యేడగు
తారకుపాదములు నాల్గు। ధరణిని నెపుడున్
తారల మొత్తము పాదా
లారయ నూటెన్మిదనగ। నగు తొమ్మిదియౌ।। 92

కం. రాసులు పదిరెండౌగద
రాసికి పాదములు తొమ్మిది। రాసులనరయన్
రాసుల మొత్తము పాదా
ల్రాసిలు నూటెన్మిదగుచు। భావముగంటే।। 93

తే.గీ. మానవుల కష్టసుఖములు। మానవులకు
తెలియజేసెడి తారలు। కలియుగమున
కలవు తొమ్మిది వాటిని। తెలియుదేవి
జన్మ సంపద్విప క్షేమ। సాధనైధ
నయను మిత్ర పరమ మిత్ర - నందసుతమ
హా పవిత్రత చివర ప్రత్యక్కుయగును।। 94

ఆ.వె. మసకు। నాయువెట్లొ। మన బ్రహ్మదేవున
కగును వందయేండ్లు। లని తలతురు
అదియు శుద్ధ దోష। మజునకు నూటెన్మి
దని వచించె శాస్త్ర - మది నిజంబు॥ 95

ఆ.వె. అట్లె మనుజులకును। నాయువువందపై
నెన్మిదగును గాని। యేమిమాయొ।
యేమి పాపమొక్కొ। యెప్పటినుండియో
నిలచె నూటిపైన। నేటి వరకు॥ 96

ఆ.వె. బ్రహ్మవాచ్యమగుచు। ప్రణవమైయలరారు
నవమె బ్రహ్మమనుచు। నవనియందు
ప్రాజ్ఞులైన వారు। పరిశీలనము చేసి
తెలిసికొందురనుచు। తెలియుగౌరి॥ 97

తే.గీ. రామకృష్ణులు, గౌరి, పూ। ర్ణావతారు
లైన కతమున వారలు। నవతరించు
నట్టి తిథులు పావనములు। నట్టి తిథుల
వారి నర్చింపవలెగాని। వాని విడిచి
ఊళ్ళకేగుట శుభకార్య। ముర్వియందు
పనికిరావని పెద్దలు। పలికెయుంద్రు
గనుక పయనము నవసర। మని తలచిన
దైవ నామము చేయుచు। ధరణియందు
పనులు, పయనము చేసిన। పరమ శుభము॥ 98

తే.గీ. అవని చైతన్యములు తొమ్మి। దంకెలందు
నరయ జడమొక్కటే వాని। నన్నిటికిని
పూర్తి సహకారమందించు। కీర్తి నిచ్చు
దానినే పూర్ణమందురు। తరుణి వినవె॥ 99

తే.గీ. సున్నయన పూర్ణమేయండ్రు। సూరిమతులు
యుండిలేనట్లు కన్పించు।నుర్వియందు
కలదు లేదని యర్థముల్ గలిగియుండు
దాని మహిమెన్న జాలరు। తరుణినిజము॥ 100

తే.గీ. ఉన్నలేనట్లు లేకున్న। నున్నయట్లు
కనుపించుటయే మాయ। గానమాయ
యనగ ప్రకృతి పూర్ణము। నగుసుజగము
అండబ్రహ్మాండ గోళము। లగును నిజము॥ 101

సీ. శీర్షంబులేకయే। శీర్షంబు పంకించు
నక్షియుగ్మములేక, అన్నిటిగను
వీనులు లేకయే। వినుచుండు నన్నిటిన్
రసనలేకున్నను। రసములెరుగు
నాసికయే లేక। వాసనలనుగను
వక్త్రంబులేకయే। పలుకుచుండు
పాణి యుగ్మములేక। పనులన్ని చేయును
చరణయుగ్మములేక। చకచకచను

తే.గీ. అవయవాల్ లేకయే క్రియ। లన్ని చేయు
దానినే బ్రహ్మమందురు। తానెగగన
వాణియై పల్కు తథ్యంబు। వసుధయందు
అట్టి బ్రహ్మంబెనవమియై। నలరుచుండు॥ 102

ఆ.వె. మనుజుడనగ నరయు। మనుసంతతగుటయే
మానవాయసంగ। మహిని క్రొత్త
వాడవీవు గావు। వసుధ విరాజిలు
పాతవాడవీవు। పరముడీవె॥ 103

సీ. ప్రకృతియొ। పరమాత్మ। పరమాత్మయొ। ప్రకృతీ
రెంటిక భేదంబు। రెండు నొకటె
బ్రహ్మంబు నుండియే। పరమాత్ముడుదయించె
బ్రహ్మంబునుండియె। ప్రకృతి వెలసె
చేతన జడములు।చేరికే బ్రహ్మంబు
బ్రహ్మంబెతొమ్మిది। బ్రహ్మేనవమి
ప్రకృతియె। లేదెందు। పరమాత్మ లేకున్న
పరమాత్మయే లేదు। ప్రకృతి లేక

ఆ.వె. అట్లె నవమిలేదు। నవనితొమ్మిది లేక
అవని తొమ్మిదేది। నవమిలేక
అట్టిదైవశక్తి। నలరారు నట్లైన
అట్టి శక్తికేను।నంజలిడుదు।। 104

ఆ.వె. ఇనుని కప్పివేయు। ఘనుని విధంబుగా
చేతనమును కప్పు। చేవగలిగి
జడముగాననట్లె। జడమైన ప్రకృతి
పురుషు కప్పివైచు। పూర్తిగాను।। 105

తే.గీ. ఘనుల-చొచ్చుకుపోయెడి। యినునిపగిది
ప్రకృతిలో చొచ్చుకొని పోవు। పరముడైన
పురుషుడెప్పుడుగాన స్త్రీ। పరుషులిర్వు
రొక్కరే గానిభేదంబు। నిక్కమరయ
లేదులేదు లే వేదాల। లేదు గౌరి।। 106

తే.గీ. దీనినే చెప్పె సూతుడా। శౌనకాది
మౌనులకు తనగురుదేవు। మానసమున
భక్తి చింతించి। శ్రద్ధతో। వారు నుతులు
సేయముదమందె। మౌనులున్। మాయవీడి
ప్రణవచింతన చేయుచు। పరముగనిరి।। 107

సీ. అద్భుతంబులయందు। నత్యద్భుతంబును!
పావనంబుల యందు। పావనంబు!
ఆశ్చర్యములయందు। ఆశ్చర్యజనకంబు!
నూతనంబుల నిత్య నూతనంబు!
శక్తిమంతంబుల – శక్తి మంతంబును!
సారవంతంబుల సారమగును
అర్థవంతంబుల। నర్థవంతంబును!
ముక్తిదంబుల యందు। ముక్తిదంబు!
నవనవ్య చరితంబు। భవతారక మటంచు
భక్తి వ్రాసితినాడు। భవము బాయ.

తే.గీ. హనుమదాసంద్రు నన్ను నీ। యవని జనులు
కామరాజ్జడ్డ వంశాబ్ధి। సోముడగుదు
దీని చదివిన వ్రాసిన। దీని వినిన
వారి రక్షించు శ్రీనవ। బ్రహ్మశక్తి! 108

మంగళము శబ్దశక్తికి। మంగళంబు
మంగళము నాదశక్తికి। మంగళంబు
మంగళము ప్రణవ మునకు। మంగళంబు
మంగళము నవశక్తికి। మంగళంబు

# కవి పరిచయం

గ్రంథకర్త : కామరాజుగడ్డ హనుమంతరాయశర్మ



జననం : 12-6-1924
రక్తాక్షి నామ సంవత్సర
జ్యేష్ఠ శుద్ధ దశమి, గురువారం

జన్మస్థలం : చోడాయపాలెం
రేపల్లె మండలం, గుంటూరు జిల్లా

వృత్తి : ఉపాధ్యాయ వృత్తి

ప్రవృత్తి : నిత్య పురాణశ్రవణం
ధార్మిక, నైతిక, భక్తిరసాత్మక పద్య రచన

ఇతర గ్రంథములు :
శ్రీ మద్రామయణ సుధాసార శతకములు, సీసపద్యములు
శ్రీ ఏకదంత శతకము, ఆటవెలదులు
శ్రీ శంభు శతకము, కంద పద్యములు
శ్రీ కనకదుర్గ శతకము, ఆటవెలదులు
శ్రీ కృష్ణ శతకము, కందపద్యములు
శ్రీ నృశింహ శతకము, ఆటవెలదులు
శ్రీ మూర్తిత్రయ స్తవము, ఉత్పల, చంపక, మత్తేభ శార్దూలములు
శ్రీ శ్రీనివాస స్తవము, మత్తకోకిలలు
శ్రీ శివస్తవము, కవిరాజ విరాజితములు
శ్రీ సాగరమధనము, పంచచామరాలు
శ్రీ సత్యదేవుని స్తవము, తరలములు
శ్రీ సత్యసాయిబాబా శతకము
శ్రీ బృందామాత శతకము
శ్రీ ఆంజనేయ పురాణమాల
నీతి పద్యములు
భజన కీర్తనలు
నవ బ్రహ్మచరిత్ర
శ్రీ వాసుదేవశతకము
సర్వదేవతలపై పద్యములు
నీతి పద్యాలు
సాయి కీర్తనలు
రాధా కీర్తనలు